





# చాణక్య

## (ఏకపాత్రాభినయం)

రచయిత:

"కవిరత్న", "కవితిలక", "మధురకవి", "సన్మానసమ్రాట్"

శ్రీ కోడూరి శ్రీరామ్మకవి

తొలి ముద్రణ 1986

ప్రతులు 500

మూల్యం — ఒక రూపాయి

ప్రదర్శకులు రచయిత పూర్వానుమతి
తీసికోవడం కనీస ధర్మం

భారతీ పబ్లికేషన్స్
11/144 ఏలూరురోడ్డు
గుడివాడ — 521 301

---

శ్రీ శ్రీ రాఘవేంద్ర ప్రెస్, గుడివాడ

---

# కృతజ్ఞతలు

వన్నెగాంచిన చాణక్య కన్నెనిచ్చి
సన్నుతుల నందజేసిన సత్కవీంద్ర
అందు కొమ్మిదె ముదముతో వందనములు
ధరణి కోడూరి శ్రీరామ ధన్య చరిత.

అందరడిగెడు నట్టుల అరణ మడుగ
కట్న కానుక లేవంచు కసరు కొనను
మీదు అందాల భరిణకుమెరపు గూర్చి
సాదరంబున సాకెద సదమలాత్మ.

కళలకాణాచి గుడివాడ గడ్డపైన
సరస సంగీత సాహిత్య సౌరభముల
రాణ వినుతిని జేసిన రామసుకవి
తనర గైకొమ్ము నాదు కృతజ్ఞతలను.

— పణాలి రామకృష్ణారెడ్డి M. A.



కృతిపతి

**శ్రీ పడాల రామకృష్ణారెడ్డి B. A.**

# అంకితము

శ్రీ పడాలకులీన విశిష్టగుణుఁడు
రమ్యరామకృష్ణారెడ్డి ప్రథితయశుఁడు
వినయభూషితుఁడగుచును వేడ్కమెయిని
పరహితమ్మును కోరు సత్పూరుఁడతడు
క్షణము వ్యర్థము కానీడు జగతియందు
దేవదేవుని సత్కృపన్ దేజరిల్లు॥

సంగీత సాహిత్య సరస విద్యలయందు
భారతీ ప్రోత్సాహ భావుకుండు
గద్యపద్యావళి కావ్యముల్ రచియించి
ఘనతగాంచినయట్టి కవివరుండు
కవిజయంతులకేగి కావ్యాళి గొనియాడి
సంస్తుతుల్ వడసిన సజ్జనుండు
సన్మాన సభలను జక్కఁగాఁ గ్రైసేసి
బిరుదమ్ములందిన విబుధవరుఁడు
వేంకటేశుని మదియందు పొంకమలర
పాదుకొల్పినయట్టి సద్భక్తుఁడతఁడు
కాన శ్రీరామ "చాణక్య" కావ్యమిపుడు
అంకితంబిచ్చి నేను ధన్యతనుగంటి ॥

# ముందుమాట

సుమారు పదిసంవత్సరాలక్రితం "చాణక్య" ఏకపాత్ర వ్రాశాను. ఆర్థిక కారణాలవల్ల నా పుస్తకాలు చాలవరకు అచ్చులోపడలేదు. నేడు సరస్వతీ హృదయమెరిగిన సౌజన్య మిత్రులు కొందరు ఉదారులై అవి ముద్రింప ముందుకొచ్చుట నాభాగ్యం. వానిలో యిది తొలికుసుమం.

చాణక్యుడు ఆకలిగొని, భోజనార్థమై నందుని భోజన శాలలో ప్రవేశించి రాజగురుపీఠముపై ఆసీనుడుకాగా దానిపై రాజగురువుతప్ప తదితరులాసీనులగుటకు వీలులేదని నందుడు చాణక్యుని జుట్టుపట్టి పీఠముపైనుండి యీడ్చుటతో రోషపూరితుడైన చాణక్యుని అంతరంగమథనమును ఏకపాత్రాభినయ రూపములో మలచితిని. చారిత్రకమైన యీ రచనలో అక్కడక్కడ చేసిన మార్పులు, కూర్పులు, చేర్పులు నాటకీయత కోసంమాత్రమే. తెలుగు సాహిత్యంలో యిలాంటి "సూడో హిస్టారిక్స్" ప్రక్రియ అనాదిగావస్తున్నదే శ్రీ వేదం వెంకటరాయ శాస్త్రిగారి ప్రతాపరుద్రీయం నాటకంకూడా ఈ కోవలోనిదే.

మాన్యులు, సహృదయభావుక పట్టభద్రులు, సౌజన్యులు, కవిమూర్ధన్యులు, నటమిత్రులు, "సకలకళాసాగర", "లలితకళాభిశేఖర" బిరుదాంకితులు శ్రీ పడాల రామకృష్ణారెడ్డి ఎం. ఏ. గారికి నా యీ లఘుకృతిని అంకితమీయగలుగుట నేను చేసుకున్న సుకృతఫలముగా భావిస్తున్నాను. నాటక రంగంలో ఆయన ప్రతిభకు ప్రజలందించే అభినందన పరంపరా పూమాలలలో నా యీ పూబాల వారి కంఠసీమకు మణి మాల కావాలని నా ఆకాంక్ష.

పుస్తక ప్రచురణకై ఆర్థిక సహాయ మందజేసిన శ్రీ అబ్బూరి కళాపరిషత్ వారికి నా కృతజ్ఞతలు.

— కోడూరి శ్రీరామకవి



# నందిరాజు నారాయణశాస్త్రి

స్టేజి రేడియో & టి. వి. ఆర్టిస్టు

గుడివాడ.

"నాటకాంతమ్ హి సాహిత్యమ్" అన్నారు పెద్దలు. సాహిత్య ప్రక్రియలలో నాటకానికున్న స్థానం విశిష్టమైనది. హావభావ నటు విన్యాసములు దీనికి జోడింపబడివుండుటే ఈ విశిష్టతకు కారణము. ఇందు ఏకపాత్ర మరింత క్లిష్టమయినది.

సాహిత్యాచార్య శ్రీ కోడూరి శ్రీరామకవి గారి "చాణక్య" ఏకపాత్రాభినయ రచన నన్ను ముగ్ధుణ్ణిచేసింది. కథాగమనం, అంతర్మథనం, పాత్రప్రవేశం, భాషాశైలి

ఉద్వేగవంతమై రసావేశంతో సాగింది. అనాదిగా రంగస్థలిపై దుర్యోధనుడు, మాయలఫకీరు, భస్మాసురుడు, హిరణ్యకశిపుడు యిత్యాది పేరుమోసిన ఏకపాత్రలను అంతో యింతో అభినివేశంతో ప్రదర్శించే నాకు యిది ఆకాశంలో క్రొత్త నక్షత్రంలా కనిపించింది. పాతవానిని వినివిని విసుగుచెంది క్రొత్తవానికై ఎదురుచూస్తున్న రసజ్ఞులైన తెలుగు ప్రేక్షకుల ఆదరాభిమానాలను చూరగొనగల కళాఖండం. ప్రదర్శన సౌలభ్యం పుష్కలంగాగల రచన యిది. టి. వి., రేడియోలు ప్రసారం చేయదగ్గ చక్కని స్క్రిప్టు.

శ్రీరామకవిగారు తాము స్వయంగా కవిపండితులయి వుండికూడా యితర కవిపండిత కళాకోవిదులెందరినో సన్మానిస్తూ "కళామతల్లికి చేయగల్గిన సేవ నాదియిదే" అని పదిమందినీ ఆనందపరుస్తూ తానానందపడే స్వార్థచింతనలేని మహామనీషి. తన యీ ఏకపాత్రాభినయ రచనను సుప్రసిద్ధనటులు, ప్రముఖ సాహిత్యవేత్త, వక్త, ప్రయోక్త, మధుర గాయకులు, సద్విమర్శనా చక్రవర్తి శ్రీ పడాల రామకృష్ణారెడ్డి ఎం. ఏ. గారికి అంకిత మివ్వడం సకల కళలనూ ఒక్కసారిగా సత్కరించడమే. సాహిత్య నాటక రంగాలలో సమున్నతస్థానాన్ని పొందిన శ్రీ రామకృష్ణారెడ్డిగారు దీనికి కృతిభర్తకావడం పూవునకు తావి అబ్బినట్టు.

సమస్త కళాస్వరూపుడైన ఆ నటరాజస్వామి కృతికర్తకూ, కృతిభర్తకూ సర్వాభీష్టములూ సిద్ధింపజేయుగాక.

**- నందిరాజు నారాయణమూర్తి**
(అబ్బూరి కళాపరిషత్)

(చాణక్యుడు ముడివిడిన సిగతో, క్రోధముతో ప్రవేశించి)

నందా! దుర్మదాంధా! ఎంతపని చేసితివిరా! అవమానము - ఘోర పరాభవము. నిండు సభామధ్యంబున, సకల జన మంత్రి పురోహిత పరివార సమక్షంబున నా కేశముల బట్టి, క్రిందికీడ్చి, నేలబడవైచి "పో బాపడా" అని పరిహసింతువా! ఏమి! ఈ చాణక్యుడు నీకు ఒక క్షుద్రకీటకమువలె గోచరించెనుగా! హుం. నీవు పట్టిలాగిన యీ కేశములు విశేష మేధా గరిమతో దేవగురువుబృహస్పతినే ధిక్కరింపజాలు ఒక దివ్య విప్రోత్తమునివని, యీ పవిత్ర శిరము చతుర్వేదోపనిషదాదుల పారము ముట్టినట్టి ఒక ధర్మశాస్త్రపారంగతునిదని ఎఱుంగవైతివి. నీమేలుకోరి ప్రమాదము హెచ్చరించ వచ్చిన యీ పారుడు అర్థశాస్త్రమునకాటుపట్టని, రాజనీతిపారంగతుడని తెలుసుకొనుటకుకూడ ఇచ్ఛగింపని కండకావరమా! "ఓరీ వాచాలా! నీకు అగ్రాసనాధిపత్యము కావలయునురా!" అని కదా నీ ప్రశ్న? ఔను— ఒక్క అగ్రాసనాధిపత్యమే కాదు. ఈ

సర్వసర్వంసహామకుట భారతావని విజ్ఞాన విశేషమంతయూ యీ చాణక్యుని మేధాసంపత్తిలో యేకదేశమేరా శుంఠా.

ఏనాడు నీవు నాకేశములనుబట్టి బరబర ఈడ్చి పరిహ సించితివో ఆనాడే నీ పతనమారంభమైనది. అదే సమస్త భార తావనికీ శుభోదయము_ అదే నీ నిరంకుశ అధికార మదాంధ త్వమునకు చరమగీతము. ఓరీ క్రూరాత్మా! ఈ చాణక్యుని తృణీకరించి పరిభవించగలిగితినని గర్వపడుచున్నావుకదూ! మూర్ఖుడా- ఈ బోడి బాపడు ఒక దండతాడిత కాలభుజంగ మని, సాగరగర్భ సంజనిత బడబానలజ్వాలయని, క్షీరసాగర మధనవేళాసముద్భూత హాలాహలవిషజ్వాలయని, సకల క్షత్రియకులవినాశకర భార్గవరాముడని, కామదహనవేళా త్రిలోచనకోపవినర్గతకాలాగ్నికీలయని యెఱుంగవైతివిగా! కానిమ్ము. ఆ సంగతి యిక తెలిసికొనియెదవుగాక_

భారతావని నేల నాలుగుచెరగులా శత్రుసేనల ప్రతి ఘటనలో భారతవీరుల కవోష్ణరుధిరధారలు వీధులలో ఏరులై పారుచుండ, మానరక్షణకై గతిలేక పవిత్ర భారత నారీమణి ఆత్మార్పణ చేసుకొనుచున్న తరుణములో, ముక్కుపచ్చలారని పసిపాపల అసహాయ ఆక్రందనల నడుమ ఆనందోత్సాహము లతో, సైనిక సంపత్తితో, విజయగర్వముతో విర్రవీగుచు ఆ యవనవీరులు నా దేశమాతను కబళించుచున్నతరి ఆవేదనతో ఆ విపత్తును తెలియజేయవచ్చినఈ చాణక్యునికి అవమానమా!

ఏమిరా నీ పొగరు? ఇయ్యది నాకే అవమానమైనచో నా హృదయమింత క్షోభించెడిది కాదు. కాని యిది యావద్భారత జాతి జీవన్మరణ సమస్య- సహించుట ఎట్లు? రాజకీయ విజ్ఞాన మింతయు తెలియాలేని అంధుడవు. భారత సామ్రాజ్యము నకు రాబోవు విపత్తు గ్రహించలేని మూర్ఖుడవు. స్వార్థపరత్వ ముతో ఇచ్చకపు మాటలాడుచు కానుకల కౌగిలిలో నిన్ను కబ ళించ చూచుచున్న గ్రీకు రాయబారుల భాషణములు నీకు ప్రీతి పాత్రములా! నీ హితముకోరి కర్తవ్యము బోధింపవచ్చిన నా భాషణములు నీకు హేళనపాత్రములా! అహా! ఏమిరా నీ రాజరికము!

ఓరీ నందా! గర్వాంధా! చూడరా అటు. అవిగో గ్రీకు వాహినుల కదలికలు- భేరీదుందుభుల మ్రోతలు- యవనసేనల హాయహేషలు. జయజయధ్వానములతో ఉరకలతో వెల్లువలై పురోగమించుచు మగధను ముంచివేయుచున్నవి చూడరా! అవేరా రాబోవు దాస్యశృంఖలాల ప్రతిధ్వనులు. భారత సోద రుల కళేబరాలపై వికటాట్టహాసములతో నడచివస్తున్న యవన సైన్యమదిగో చూడరా! కనిపించుటలేదురా దేశమాత కన్నీళ్లు! భోగలాలునుడవై తల్లిని తాకట్టుపెట్టు నీవూ ఒక తనయుడ వేనా? .... ఛీ-చాణక్యా! ఉపద్రవమును హెచ్చరించి హితము చెప్పవచ్చితివే! కాని ఫలితము? చెవిటివానిముందు శంఖ మూదెగదా! పైగా దారుణ పరాభవమా! మంచిది. నీకు తగిన

శాస్త్రియే జరిగినది. సెహభాష్! కాకున్న ముక్కుమూసుకొని కానలలో తపమాచరించు విప్రునకేల యీ రాజకీయ హేల? రాజ్యములు దగ్ధమైననేమి భగ్నమైననేమి? నీ హెచ్చరికను ఆ మూఢచక్రవర్తి విననప్పుడు నీవేమి చేయగలవు? చండ ప్రచండ మార్తాండ విక్రములగు గ్రీకుల నిరోధించగలవా? ఎందులకీవ్యథ? అంతా వృథా! వృథా! వృథా!

ఏమిటేమిటీ! నిముషములో నందిని పందిచేయగల చాణక్య హృదయమేనా యిట్లు బేలపడుచున్నది! మూఢాగ్రేసరుడైన ఒక చక్రవర్తి విననంతమాత్రముననే యింతటి నిరుత్సాహమా! "ప్రజావాణిని పరికింపని ప్రభువు, హితబోధవినని సమ్రాట్టు, గర్వాంధకారియగు చక్రవర్తి, దేశపరిస్థితిని గమనింపనిరాజు, రాజ్యాధికారపదవికి అనర్హులు" అని చెప్పిన రాజనీతిజ్ఞుడేనా యీ చాణక్యుడు. నీ రాజనీతి పిరికిపడుచున్నదా? లేదు.... లేదు.... లేదు. ఈ చాణక్యుని రాజనీతికి ఎదురులేదు. భంగపడిన యీ బోడి బాపడే యీ సవాలు నెదుర్కొనగల సమర్థుడు. ఈ చాణక్య మేధాశమీశాఖాజనితమారణహోమాగ్నిలో శత్రువర్గము సర్వనాశనము కావలసినదే. నందా నా ముందా నీకుప్పిగంతులు! ఇదిగో యీ చాణక్యుని ప్రతీకార చర్య యిప్పుడే ప్రారంభమగుచున్నది- ఇది ధర్మయజ్ఞము. ఈ యజ్ఞములో మీరు సమిధలు. ఆ భీకరమహామృత్యుదేవతా

వదనజ్వాలామహాగ్నిలోపడి మీరుమలమలమాడిపోవలసినదే. అప్పటివరకూ, నీవు పట్టిలాగిన నా యీ శిరోజములు నీ రక్త ధారలచేత తడుపబడిన హస్తములతోగాని ముడివేయనురా. ఇదే నా శపథము. నేటినుండి నేను నీపాలిటకాలభుజంగమును. కాదు కాదు మృత్యుదేవతను. (పైకిచూచి) ఓ నీలకంఠా! నీ గళస్థితక్రూర భుజంగములను నాకు బానసటుగా నడిపించు. ఓ భూతనాథా! నీ ప్రమథగణంబుల నావశముగావించు. ఓ ఆసె నటా! నీ భీకర నాట్యముతో నా విలయతాండవమునకు శృతి కలుపు. ఓం హరహరమహదేవ్! (అని ఒక్కడుగు ముందుకు వేసి తడబడి) అబ్బా! కాలిలో కంటకము గ్రుచ్చికొనినదే! కంటకమా! ఏమి! నందునకేగాక నీకునూ లోకువైతినా? నేటి నుండి యీ చాణక్యుడు మృత్యుదేవతా స్వరూపుడని తెలు సునా? చూడు నిన్నేమి చేసెదనో.... (అని కాలినుండి తీసి చూస్తూ ఆలోచించి) అరె! నేనెంత పొరబడితిని! కంటకమా! నీ సందేశ మర్థము చేసికొనలేకపోయితిని. నే తలపెట్టు కార్య మునకు మార్గమంతటను ఎన్నో సంకటములు ఎదురుకాగల వని ముందుగా హెచ్చరించుచుంటివా? మంచిది. (ముల్లును పరికించి) సమయమునకు మిత్రునివలె హెచ్చరించిననిన్ను యిక్కడితో పారవేయక ఎదలో పదిలముగ దాచుకొనియెద. నిత్యము నీ హెచ్చరిక నా రక్తములో జ్వలించుటకై నిన్ను కాల్చిచూర్ణముచేసి నీటిలోకలిపి త్రాగెద. నరనరములలో ప్రతీ

కారవాంఛ పరుగులెత్తించుము, జై శంకరా! ఆ!.... ఎవరది? (వెనుతిరిగి చూసి) ఓహ్! నానీడయేనా। (ఆలోచించి) ఇలా నీడలా వెన్నంటిరాగలధీరుడు! ఆ! ముర ....తనయుడు ....భేష్- ఎంత చక్కటి ఆలోచన! సెహభాష్ ....చంద్రగుప్తా! ఇక నీవు భారత క్షోణీతలభావి చక్రవర్తివి. దీనితో నందవంశము సర్వనాశనము - హాహాహా హాహాహా నందవంశము సర్వనాశనము హాహా హాహా జై నీలకంఠా! చంద్రగుప్త మహారాజునకు జై. చాణక్యా! ఇక ముందుకు నడు....పద.... నీవే విజయుడవు. నీవే విజయుడవు. హాహాహాహా ...హాహాహాహాహా.... హాహాహాహాహా (అంటూ ఆనందంతో నిష్క్రమిస్తాడు.)







**శ్రీ కోదూరి శ్రీరామ కవిగారి**

**జననం : 12-4-1916.**

కృష్ణాజిల్లాలో వాడపల్లిగ్రామం శ్రీకోదూరి లక్ష్మీనరసింహం, వేంకటరమణమ్మగార్ల ద్వితీయ పుత్రులు. పి.డబ్ల్యు డి, రోడ్స్ & బిల్డింగ్స్ డిపార్టుమెంటులో పని చేసి 1972వ సంవత్సరంలో రిటైర్ అయ్యారు. విద్యార్థి దశ నుండీసాహిత్యాభిమాని. పదహారవ ఏటనుండీ కవితలు చెప్పడం, రచనలు చేయడం ప్రారంభించారు శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావు గారితో కలిసి భారతీ సమితిని గుడివాడలో స్థాపించటమేగాక సారస్వత ప్రసంగాలతో, కవితా గానాలతో ఆంధ్ర, తెలంగాణ, రాయలసీమలలో సాహిత్య జీవిత యాత్రను సాగించారు. ఎన్నో బిరుదులు పొందారు.

"శ్రీరామ సమస్యాపూరణావళి" "శివమనోరంజని" "గీతాసారము" "నీతిరత్నావళి" "కవిజన మనోరంజని" "శ్రీశైలసోత్ర మంజరి" "వేంకటేశ్వర స్తవం" "ఆత్మానందం" "సుధీవరులు" వీరిపద్య కావ్యకుసుమాలు. "హాస్యమంజరి" వీరి గద్యకావ్యం. ప్రస్తుతం గుడివాడలో భారతీ సమితి, ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక మహాసంఘం, సారస్వత జ్యోతి మిత్రమండలులకు కార్యదర్శిగా పనిచేస్తున్నారు. వీని ద్వారా దేశంలోని ప్రముఖ కవి, పండిత, కళాకారులెందరికో సత్కారాలు, సన్మానాలు, కనకాభిషేకాలు, మౌక్తికాభిషేకాలు, సహస్రచంద్ర దర్శన మహోత్సవాలు, బిరుదప్రదానాలు, షష్టిపూర్తి ఉత్సవాలు, సప్తతులు ఎన్నోచేయిస్తూ సాహిత్య కళారంగాలకు అంకితమై సేవచేస్తున్న సహృదయులు. రేడియోలో "సమస్యాపూరణం" శీర్షికలో ప్రతివారం తప్పక పాల్గొనే సుప్రసిద్ధ కవులలో వీరొకరు.

\- శివశ్రీ